mohan
PUBLICATIONS

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్యాది అనేక విషయాలు తెలుసుకోండి... ఫేస్‌బుక్
FB@mohanpublications
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533 101.
Granthanidhi.blogspot.in

# తెలుగు భావ కవి

# కృష్ణశాస్త్రీ

# Cinema Songs



# మా మాట

పాటంటే చెవి కోసుకోని వారు, ఆస్వాదించలేని వారు బహుశా వేళ్ళ మీద లెక్క పెట్టవచ్చు. నిజానికి మనిషి జీవితానికి ఆలంబన పాట. అసలు పాటను మనిషిని వేరు వేరుగా చూడలేం. ప్రతి ఒక్కరూ సమయానుకూలంగా ఏదో ఒక పాటనో, పద్యాన్నో పాడుతునే ఉంటారు. ఈ విధంగా ఎంతో మంది మనసులో పదే పదే మెదిలే చిరపరిచితమైన పాటల్లో శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి పాటలెన్నెన్నో -

జానుపదాలు, పల్లెపట్టులు, జావళీలు సరళమై ఇట్టే మనసుకు హత్తుకునే పదాలతో చక్కగా అల్లిన పాటలు కృష్ణశాస్త్రి గారివి. ఏ పాటను తీసుకున్నా 'ఇది ఎక్కువ' 'ఇది తక్కువ' అనిచెప్పనలవి కానివి. ఒక్కొక్క పాటను గురించి వర్ణిస్తూ పోతే కాలమే దానికి అవధి. ఈ పాటలలో రక రకాల అనుభవాలు: ఆనందం - విషాదం, మంచీ - చెడ్డా, సుఖం - దుఃఖం, నిరాశ - నిర్లిప్తం, కరుణ - భక్తి ఇలా అన్ని రకాల అనుభవాలలో కాలి బంగారంలాగ పరిపక్వమొంది బయటకు వొచ్చిన పదాలు కృష్ణశాస్త్రి పాటలు. అందుకే కృష్ణశాస్త్రి గారే స్వయంగా అన్నట్లు అన్ని కళల కన్నా గానం సద్యః మాట మనిషైతే, పాట పక్షి లాంటిది. అది అంతరిక్షాల్లోకి రయ్యని దూసుకుపోతుంది. అది అందుకోలేని ఎత్తులు లేవు, చొచ్చుకుపోలేని లోతులు లేవు. "మాటల కందని అనుతులు వచ్చినప్పుడు వాటిని వ్యక్తపరుస్తుంటేనే గాని మనం బతక లేనప్పుడు పాటే మనకి ఏక శరణ్యం" అందుకే మనిషి బాధను గానీ, ఆనందాన్ని గాని పొందినప్పుడు స్వాంతన కోసం సంగీతాన్నో, సంగీత భాషాన్నో ఊతగా తీసుకుంటాడు."

చివరిగా కృష్ణశాస్త్రి గారి సాహితీవెండి రథంలో వెండి తెరకు తెనిగించిన వాటిని రెరిడు భాగాలుగా విభజించి ముద్రిస్తున్నాం. అందులో కొన్ని గీత కుసుమాలను ఒక వొరవడిలో ఏర్చి కూర్చి 'మేఘమాల'గా అల్లాం, మరి కొన్నిటిని అందమైన గోరింటగా చేశాం - ఇక ఆనందం ఆస్వాదనమే తరువాయి మరి ఇక లోపలి పేజీల్లోకి వెడదామా....

**ఓరియంట్ లాజ్మన్.**

# ముందు మాట

'కృష్ణశాస్త్రి సాహితి'- రచనలన్నింటినీ ప్రకటించడానికి ఓరియంట్ లాఙ్మన్ వారు తలపెట్టిన యజ్ఞంలో చివరి విడతగా వెలువడుతున్న 'యక్షగానములు', మూగ నయాక అనే సంకలనాలకు 'ముందుమాట' నన్ను రాయమన్నందుకు సంపాదకులకు నా కృతజ్ఞతలు.

ఈ సంకలనాలు ఒక్కొక్కటీ ఒక్కొక్క రకానికి చెందిన ప్రక్రియ!

'యక్షగానములు'- మధ్యయుగానికి చెందిన తెలుగు వారి నృత్య గేయ నాటక ప్రక్రియ. ఇందులో దరువులూ, కందార్థాలూ, శబ్దాలతో కూడిన దైవస్తుతి జతులూ ఉంటాయి. మామూలు గేయ నాటకాలకీ, యక్షగానాలకీ సంగీతపు కూర్పులో చాలా వ్యత్యాసం ఉంటుంది. ఆ దరువుల్లో సందర్భాల్లో నాటకీయమైన సంవాద ధోరణీ, నృత్యం అంటే అడుగులతో నర్తించడానికీ, చేతులూ మొదలైన అవయవాలను లయానుగుణంగా పాటకు రాగానికీ తగినట్లుగా అభినయించడానికి అనువుగా ఉండాలి. యక్షగాన సంకలనంలో ప్రవేశిక ఉండనే ఉంది. గనుక ఈ ముందు మాటలో ఇంతకంటె యెక్కువ వ్రాయనక్కరలేదు.

'మూగనయాక'- శాస్త్రి గారి గొంతు మూగ బోయాక ఆయన నోటు బుక్కులపై వ్రాసిన వ్రాతలు: ఆయన వ్రాతల ప్రకారం-

"ఈ వ్రాతలలో రకరకాలున్నాయి. వీటిలో మన దేశంలో ప్రముఖులు మొదలుకొని సామాన్యుల వరకూ, అందరి మీదా నాకు తోచిన అభిప్రాయాలుంటాయి. నిజాయితీగా నిక్కచ్చిగా వ్యక్తపరచినవి అవి.

నా అభిప్రాయాలూ విలువ కట్టడాలూ పొరపాట్లు కావచ్చు! కాని నిజాయితీవి అయితే మోటుగా క్రూరంగా ఉండవు.

అనేక విషయాల మీద వ్రాసిన వేవో మాటలుంటాయి పానుగంటి వారన్నట్లు - బ్రహ్మ పదార్థం మొదలుకుని బజారు ధరల వరకు!

'సంగీతం' నాదం ద్వారా సాధించేది కవిత్వం శబ్దం ద్వారా సాధించాలి

అంటాడు. ఆ వెంటనే 'నేను అలంకార శాస్త్రాలు (ప్రాచ్యపాశ్చాత్యాలవి) బాగా చదవలేదండీ బాబూ!' ఆయనకి సన్నిహితుణ్ణైన నాబోటివాడు- ఆ వాక్యంలోని 'నిజాయితీ కించిత్తైనా శంకించకుండా ఉండడం కష్టం! పైకి ఉల్లేఖించిన ఉత్ప్రేక్ష చదివిం తరవాత.

'గేయ రచన నాకు తెలిసినట్లు తెలుగు వాళ్లలో ఎవ్వరికీ తెలియదు కవిత్వం అంటే నాకు తెలిసినట్లు కూడా అంతే!'

"ఈ century లో తెలుగువాళ్ళలో stylistsముగ్గురు నలుగురు ఉన్నారు. వాళ్ల గొంతు తెలిసి పోతుంది. (అని 'మూగనయాక' వ్రాతల్లో శాస్త్రి అంటారు.)

వేలూరి శివరామశాస్త్రి, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మా నాది కూడా అనుకుంటాను"

ఈశతాబ్దంలో తెలుగు గేయం వ్రాయగల వాళ్ళు

1. వల్లూరి జగన్నాథరావు (కోడీనా కోడీ వ్రాసిన ఆయన (genius errtic)
2. బసవరాజు అప్పారావు
3. నండూరి సుబ్బారావు
4. నేను(మన్నించాలి)

Previous generation లో (ఆదిభట్ల) నారాయణదాసు-

మేం ఇద్దరం కలిసి కూర్చుని చేసిన 'కృష్ణ రజని'లోని కొన్ని గేయాలూ కాక, యక్షగాన రచనలాగా పిఠాపురపు రాజరాజేశ్వరీదేవికి చేసినహెచ్చరిక గేయంలో నేడు ఆరంభ గేయ పాదానికి ఆయన పూరణమే నాకు ఆయన చేసిన గొప్ప ఆశీస్సుగా భావిస్తున్నాను.

18 ఫిబ్రవరి 1995 **బాలాంత్రపు రజనీకాంతరావు**

30-20/3-15/6
లాల్‌బహదూర్‌శాస్త్రి వీధి
సీతారాంపురం- విజయవాడ

# చిత్రాలు, పాటలు

# 1 ఏక వీర

ప్రతి రాత్రి వసంత రాత్రి
ప్రతి గాలి పైరగాలి
బ్రతుకంతా ప్రతినిమిషం పాటలాగ సాగాలి
ప్రతినిమిషం ప్రియా, ప్రియా పాటలాగ సాగాలి
ప్రతిరాత్రి వసంతరాత్రి...

నీలో నా పాట కదలీ
నాలో నీ యందె మెదలీ
లోలోన మల్లె పొదల
పూలెన్నో విరిసి విరిసీ
మనకోసం ప్రతి నిమిషం మధుమాసం కావాలి
మన కోసం ప్రియా, ప్రియా మధుమాసం కావాలి
ప్రతిరాత్రి వసంతరాత్రి...

ఒరిగింది చంద్రవంక
ఒయ్యారి తార వంక
విరజాజితీగ సుంత
జరిగింది మావిచెంత
ననుజూచీ, నినుజూచీ వనమంతా వలచింది
ననుజూచీ, ప్రియా, ప్రియా వనమంతా వలచింది
ప్రతిరాత్రి వసంతరాత్రి...

2

కనిపెట్టగలవా, మగువా, కళ్లకు గంతలు కడితే?
పసిగట్టగలవా, తెరవా, పైపైన పుప్పొళ్లు చల్లితే!
మగవాడెవ్వరైనా, ఎవ్వరైనా,
వగకాడెదురైనా, ఎదురైనా,
కళ్లల్లో కళ్లుంచి చూసేనా
ఒళ్లాగిపోకుండ వుండేనా?

కనిపెట్టగలవా...

జుమ్మనకుండానే, కిమ్మనకుండానే!
ఒంటరిదారుల వెంట, తుంటరి తుమ్మెద వచ్చి!
మందారం ఒయ్యారం మదిలో మెచ్చి!
పొదవెనుక పూపాన్పు పరచే వుందంటే –

కనిపెట్ట గలవా...

మారువేషంలో ఏ మహరాజో,
మనిషి రూపంలో మన్మథుడో,
వెన్నావంటి మనసు దోచేనా,
వెన్నెల వంటి మనసు దాచేనా!

కనిపెట్ట గలవా...

3

ఔనే! చెలియా! సరిసరి!
ఆ హంసలనడక లిప్పుడా సొగసరీ?

అమ్మ చెల్ల తెలిసేనే యెమ్మెకాడి వగలు!
నెమ్మదిలో దాచాలని కమ్మని కోరికలు!
వాలుకన్ను రెప్పలలో వాలాడే తొందరలు
దోరపెదవి అంచుల చిరునవ్వుల దోబూచులు!
ఔనే చెలియా! సరిసరి...

పవళింపుల గదిలో ప్రణయరాజ్య మేలాలని
నవమల్లెల పానుపుపై నవమదనుడు త్వరపడులే!
చెవిపడనీవె సుంత చీరచెరగు గుసగుసలు,
రవల అందెమువ లూదె రాగ రహస్యాలు!
ఔనే చెలియా! సరిసరి...

ఏచోట దాచేవే ఈ వరకీ సిగ్గులు!
ఈ చెక్కిలిపై పూచె ఈ గులాబినిగ్గులు?
మాపటి బిడియాలన్నీ రేపటికి ఉండవులే
నేటి సోయగాలు మరునాటికి వడిలేనులే!
ఔనే! చెలియా! సరిసరీ!
ఆ హంసల నడక లిప్పుడా సొగసరీ!

# 4 మాయని మమత

రానిక నీకోసం సఖీ – రాదిక వసంతమాసం!

రాలిన సుమాలు ఏరుకుని,
జాలిగ గుండెల దాచుకుని,
ఏ దూరపు సీమనొ చేరుకుని,
రానిక నీ కోసం...

వాకిటిలో నిలబడకు! ఇంక – నాకయి మరిమరి చూడకు!
ప్రతిగాలి సడికి తడబడకు! – పదధ్వనులనీ పొరబడకు!
కోయిలా పోయెలే – గూడు గుబులై పోయెలే –
రానిక నీ కోసం...

పగలంతా నా మదిలో మమతలు – సెగలై లోలో
రగులునులే!

నిద్రరాని నిశినైనా నాకీ – నిమ్మరవేదన తప్పదులే!
పోనీలే – ఇంతేలే – గూడు గుబులై పోయేలే –
రానిక నీ కోసం...

ఆమె

ఎవరో వచ్చే వేళాయె
ఎదురై కాస్త చూస్తారా?

పిల్లలు

ఆఁ...

ఆమె

వాకిలి తెరచి ఉంచారా?
మరియొక సారి చూస్తారా...

పిల్లలు

ఆ, ఆ, ఆ

అసలే నల్లని ఒడలాయె
ఆపయి మెల్లని నడలాయె
ముసిరే చీకటి మబ్బులలో
పసిగట్టే దెట్లా?...
ఎట్లా? ఎట్లా? ఎట్లా?

ఆమె

నవ్వుల పువ్వులు పూస్తాయి
చూపుల దీపాలుంటాయి
నవమన్మథు డెవరో తెలిసిందో?

పిల్లలు

ఓ, ఓ, ఓ

ఆమె

స్వాగత గీతం పాడాలి
స్వామికి సైతం నచ్చాలి
ఎవరో వీణ? సన్నా యెవరో?
తకధం తకధం మద్దెల?
గల, గల, గల, గల గజ్జెలు?
ఆ పిల్లన గ్రోవికి సరిగా అనగలరో

పిల్లలు

ఓ, ఓ, ఓ

ఆమె

అత్తరు గంధాల్ తీసే దెవరని?
మెత్తని చేతుల పూసే దెవరని?
క్రొత్త క్రొత్త విరులూ, సరులూ, మంజరులూ
ఒత్తుగ చివురులు వేదికపై
ఒత్తకుండ పరిచే దెవరు

పిల్లలు

నీవో, మరినీవో, మరినీవో?

ఆమె

నే నెత్తెద హారతి మదిలో ఈ గుడిలోన
ఎవరో వచ్చే వేళాయె...

6

# కథానాయిక మొల్ల

ఆమె

దొరవో ఎవరవో
నా కొరకే దిగిన దేవరవో
ఈవర కెరుగని తొందరలు
ఏవో సిగ్గుల దొంతరలు

అతడు

వలచీ పిలిచేవనీ
నను పిలిచీ పిలిచీ అలసేవనీ
నీకయి దాగిన నీ దొరనే!
లోకములేలే దేవరనే!

గుడిలో దీపం వెలుగులో నీ,
దుడుకు సోయగం చూచేననీ

ఆమె

ఎవరూ చూడని ఆ సొగసు
ఇన్నాళ్ళెందుకు దాచేవనీ

అతడు

ఈ జంట కలియు శుభవేళ కలసిరావాలని

ఆమె

ఈ దివ్యమూర్తి నా హృదయవర్తి కావాలని

ఇద్దరు

జగమెల్ల యిక మెచ్చుకోవాలని...

ఆమె

ఒక కోరిక నిను వేడనీ

ఒడిలో ఎపుడూ ఒదగనీ

అతను

ఒక మాట చెవిని ఊదనీ

ఒక క్షణమైన వీడననీ

ఆమె

ఎలమావి చుట్టూ, ఈ బేలతీగ పెనగాలని

అతను

నెలవంక పక్క ఈ తళుకుతార మెరవాలనీ

ఇద్దరు

కలకాల మీలాగే జరగాలని

ఆమె

దొరవో – ఎవరవో...

ఆమె

వలచీ, పిలిచేవనీ...

7

విందువా వీనుల విందుగా గోవిందు
నాండాళ్లు పరిణయమ్మైన గాథ!
ఉన్నదా విల్లిపుత్తూ, రందు గలరు శ్రీ
హరికింకరులు పెరియాళువారు!

వారి చిన్నారి కుమారి ఆండాళ్లు, శ్రీ
తులసీ వనములోన వెలసె కూన!

అయ్యకన్నను మిన్న ఆ కన్నె! శ్రీరంగ
పురిని వేంచేసిన హరిని వలచి,

పతిగా కొలిచి, మేటి వ్రతమూని, కృతులల్లి,
సరసిజాక్షుని అలంకరణమునకు

ఏరి పూల, కూరిచి మాల, ఎలిమి దాని,
ముదిత తన క్రొమ్ముడిని మునుముందె ముడిచి,
అద్దమున చూచి, తలయూచి, అలరి, అవల
కోవెలకు నేగి, పెరుమాళ్లు కొసగుచుండె.

అప్పుడా శ్రీహరి...
చెదరదుగదే చెలువచిత్తము రవంత
పెరచింత విడనాడుకొని, నన్నే

హృదయమున నిలుపుకొనె పదిలముగ అని మెచ్చి
సదయుడయి శ్రీరంగ నగరీ
సదను, డాళ్వారులను కదలిరావించి,
ఆ సుదతి తనదేవిగ వరించెన్
ముదమందె ముల్లోకములును,
గోదాదేవి, భువనమోహనుడు పెండ్లాడగా!
చూశావా మొల్లా!

తులసి వనములోన దొరకిన మొలక
అల హరి వలపు పంజరపు రాచిలుక!

# 8 సిపాయి చిన్నయ్య

అహహా ..........

ఆ నావ దాటిపోయిందీ
ఆ ఒడ్డె చేరి పోయిందీ
అట్లాగే మళ్ళిపోయోనా
నన్నిడిచి వెళ్ళిపోయోనా
రానైనా రాలేను
నిదుర పోనైనా పోలేను
నిశి రాతిరియైనా
నీ పిలుపేనా నా ప్రియా ఆ...
అదే పూలగాలి... ఆనాటిదే జాబిలి...
ఏదీ ఎదుట మసలీ ఏదీ లేదు నా చెలి ।ఏ।
నా కోసం పిలిచావో
అపుడెంత కలవరించావో
ఆ రూపే తోచేను
అదే గుండె కాల్చేనూ...
ఇదే హెూరు గాలి
ఇదే పొంగు కడలి
ఇదే మసక జాబిలీ
ఏడీ లేడు నా మావ ఏడీ లేడు... ।ఏ।
అహహా.. నా నావ
పగలే పోయింది
నా ఏరు వేరైపోయింది
అట్లాగే మళ్ళి పోయోనా
నన్నిడిచి వెళ్ళిపోయోనా

౨

# చెల్లెలి కాపురం

నీల

ఈదారి నాస్వామి నడిచేనే! పాదాల జాడ లివిగోనే!
రానే వచ్చాడు తీరా; తానే వచ్చాడు, కృష్ణుడు!
లేవండే పొదరింట, లెండే పొగడ గోరింట

గోపికలు

ఎవరే! ఎవరే! ఎవరె?

నీల

మువ్వల మురళిని, నవ్వే పెదవుల
ముద్దాడేవాడే, నన్నేలువాడు!
కన్నుల చల్లని వెన్నెల జల్లులు విరజిమ్మేవాడే,
నన్నేలువాడు!

గోపికలు

ఓహో! ఓహో! ఓహో!
ఈ నల్లని రూపము చూసి, ఈ పిల్ల సోయగము వలచి,
వ్రేపల్లె విడిచి, రేయెల్ల నడిచి, మన పల్లెకు
దయచేశాడటే!
లేవండే పొదరింట! లెండే పొగడ గోరింట!
రానే వచ్చాడు...

కృష్ణుడు

అటు అడుగిడితే నాతోడు! ఇటు చూడు!
ఇటు నిలిచినాడు నీ కోసం, నీలా ప్రియుడు!
ఇటు చూడు!
వలచి వలచి వచ్చిన దెవరో
పిలిచి, పిలిచి అలసిన ఈ పిల్లగ్రోవి నడుగు–
పిల్లగ్రోవి నడుగు – ఇటు చూడు!

నీల

కృష్ణా – యేలస్వామి! దయమాలి, ఈ దీనురాలిని
ఎగతాళి?
నీ కళ్లయెదుట నిలువలేని, నీడకైనా నోచుకోని,
రేయికన్నా నల్లనైనా –దీనురాలిని ఎగతాళి?

కృష్ణుడు

కనులకు తోచేది కాదు, సోయగము,
మనసులో పూచేటి మధురిమ గాని!
నీ చెలులు చూసేది నీ బాహ్యమూర్తి!
నేను వలచేది నా నీలలో దీప్తి!

ఆగు! రవంత ఆగు!
ఓ మబ్బుల ఒంపులవాగు!
కరిగించకు ఈ స్వప్నం!
కదిలించకు నా స్వర్గం!
అల మునికుమారివని అనుకోనీ!
ఒక వనమయూరివని అనుకోనీ!

||ఆ||

ఎరుగుదు నిను ఎప్పటి నుంచో!
ఎదురుచూతు ఏనాటి నుంచో!

అలనాటి ఆశ్రమ వాటిలో
నడయాడే కన్నెలేడివనీ,

ఒక మావిబోదెపై ఒరిగి
ఊగాడే వన్నెలాడివనీ,

పొదచాటున మెదలే తుమ్మెదలే
అటు పొంచి చూచు నీ కన్నులనీ, అనుకోనీ!
కవిదేవుని మానస సరోవరం
కదిలించిన ఓ కలహంసీ!
దివిజ మోహినీ! అమృత వాహినీ!
తెలుసు నాకు నీ వెవరో!
ఏ తపసి మనసు భావించెనో!
ఏ తరుణి సొగసు ప్రసవించెనో!
కరుణించిన కణ్వతపోవనిలో
విరబూచిన వసంతలక్ష్మివనీ—
అనుకోనీ!

11

# ఆడజన్మ

బొమ్మలకొలువు పాట

ఎవరొచ్చారమ్మా ఎవరొచ్చారే
ఈ బొమ్మల కొలువులో ఇలవేల్పు లెవరో?
ఈ వేలుపు లందరిలో ఎవరెవరోగాని!
ఎవరే?... ఎవరే?...
వీరెవరే? వారెవరే?
ఈ వేలుపు లందరిలో ఎవరెవరో గాని ॥ఎ॥

ఇది బొమ్మల రాణి – ఇది పరమశివుని దొరసాని
ఇది వరములదేవి – ఇదే ఇదే శ్రీదేవి!
ఇదిగిదిగోనే, పదిలముగానే,
చదువులకు వెలుగులకు
చల్లని తల్లి!

ఇక బొమ్మల పెళ్లిలో ఈ కన్నియలెవరో
ఈ కన్నియ లందరిలో ఎవరెవరో గాని ॥ఎ॥

కాటుక కన్నులదీ కలికి పెళ్ళికూతురే!
నీటుగ నిలుచున్న దొర నేటి పెళ్ళి కొడుకటే
"ఓ! ఓ!"

ఏనుగ అంబారీ, మేనాసవ్వారీ, ఒహొూ! ఒహొూ!
ఒహొూ! ఒహొూ!

ఎన్నెన్నో వేడుకలు సన్నాయి మేళాలు
ఊరేగే ఒయ్యారీ పేరంటాళ్ళు!
ఈ బొమ్మల సందడిలో ఎవరెవరోగాని!
ఈ వేలుపు లందరిలో ఎవరెవరోగాని? ॥ఏ॥

12

తనకోసమని, తనహాయికని,
నా బాధను నేనే దాచుకొని,
ఎన్నాళ్ళని, ఏలాగునని,
ఈ జీవిత మిలా మోసుకొని!
తన కోసమని, తన హాయికని...

ఎటుచూచిన చీకటి పేరుకొని
ఇటుచూచిన తానిటు లాయెనని

అవమానపడి అసహాయనయి
ఇక నీదయ ఒకటే మిగిలెనని,
ఇక నీ పద సన్నిధి వాలనీ!
తనకోసమని తన హాయికని

ఒకనాటికి తానెటొ కోలుకొని
ఒక గూటికి మేమెటొ చేరుకొని
ఒక వేకువ ఎపుడో వచ్చునని
ఇక నీ దయ ఒకటే మిగిలెనని
ఇక నీ పద సన్నిధి వాలనీ

తన కోసమని తనహాయికని
ఇక నీపద సన్నిధి వాలనీ –

13

# అమ్మమాట

ఎంతబాగా అన్నావు
ఎవ్వరు నేర్పిన మాటురా
వేలెడైన లేవురా
వేదంలా విలువైన మాట

జారని వానల జల్లులు
ఊరికే ఉరిమే మబ్బులు – ఆ మబ్బు లెందుకు?
ఊరని తేనెల సోనలు
ఊరికే పూచే పువ్వులు – ఆ పువ్వులెందుకు?
ఉత్తుత్తి మాటలు అనవచ్చా!
మాటలు చేతలు కావాలి – ఆ
చేతలు పదుగురు మెచ్చాలి!
నూరేళ్లు బ్రతకాలి! ॥ఎంత॥
అన్నమాట నిలిపేవని,
అపుడే ఘనుడవైనావని,
ముందే మురిసే మీనాన్న
ఆ – ముసిముసి నవ్వుల చూడరా!

కన్నా! కన్నీరు కాదురా!
కన్నవారి దీవనరా!
ఏటికేడుగా, ఏడంతస్తుల మేడగా,
నూరేళ్లు బ్రతకాలి!
శ్రీరామరక్ష! శ్రీరామరక్ష!

ఎగిరే పావురమా! దిగు లెరుగని పావురమా!
దిగిరావా ఒక్కసారి!
ప్రతి రాత్రికి పగలుందని వెలుగుందని ఎరుగుదువా?
మోముపైని ఏ నీడలు ముసరరాదని, చంద
మామపైని ఏ మబ్బులు మసలరాదనీ ఎరుగుదువా
పావురమా!

మాకన్నా నీవు నయం!
నీకు తోచదే భయం!
మూసే చీకటుల దారిచేసి పోవాలని ఎరుగుదువా
పావురమా... ఎగిరే పావురమా ...
అటు పచ్చని తోటుందని,
అట వెచ్చని గూడుందని,
అటూ ఇటూ అడుగడుగున చుక్కదీప ముంటుందని
ఎరుగుదువా పావురమా...
ఒక్క గడియగాని, నీ
రెక్క ముడవ గూడదనీ
దూరానా ధ్రువతారను చేరే తీరాలని ఎరుగుదువా
పావురమా... ఎగిరే పావురమా ...

15

శాంతి

వేళ చూస్తే సందెవేళ!
గాలి వీస్తే పైరగాని,
ఏల ఒంటరి తోటకడకు– ఎందుకొరకు?
ఎందు కొరకు

ఆనంద్

కళ్లు కప్పే రాత్రివేళ,
ఒళ్లు నిమిరే పిల్లగాలీ,
మెల్లమెల్లన తోట పిలిచె! అందుకొరకే!
అందుకొరకే

శాంతి

అచ్చంగా వసంతమాసం వచ్చేదాకా,
వెచ్చన్ని పూదేనియలు తెచ్చేదాకా

ఆనంద్

పెదవీ పెదవీ ఎదురై ఎదురై
మధువులు వెదకే వేళా
మగువా! అదియే వసంత వేళ
వేళ చూస్తే సందెవేళ...

రెప్పల్లో దాగిన చూపులు చెప్పేదేమిటో?
గుండెల్లో గుసగుసలాడే కోరిక లేమిటో

శాంతి

రారా! వెంటనే – పొదరింటికీ
ఇక రాదురా నిదుర నా కంటికీ...
కళ్లు కప్పే రాత్రివేళ...

# జగత్ జెట్టీలు

ఒక చెలి

చిరునవ్వు దివ్వె ఏమన్నదే?

మరొక చెలి

అరమోడ్పు కన్ను ఏ మన్నదే?

వేరొక చెలి

తనకన్న మున్నె మగడున్న చోటికి
మనసు పోయె నంటున్నదే!

ఒక చెలి

లేడిలా మనసు పరుగిడినా, వగ
లాడి ఆ బిగువెందులకే?

మరొక చెలి

వేడి కోరికల దాడులకే
పూబోణి రవ్వంత జంకెనులే!

వేరొక చెలి

తొలినాటి దేనే ఈ బిగువు
ఒక రాతిరేనే ఈ బెదరు
ఆ పైన మనవైపు చూడదులే ॥చి॥

ఇంతి ముంగురులు సరదవే
వెన్నెలరాశి నొకపరి చూడాలి
ఎంత మురిపాలె అన్నకు
తన చెల్లి సొగసులు చూసుకొని

అల్లారు మేనల్లు నెత్తుకొని, అంతలో తిరిగి వచ్చునని,
శ్రీవారితో ముందే చెప్పాలని ||చి||

కలికిరో! కలువరేకులలో
కనిపించు ఆ మంచు ఎందులకు?
కమ్మగా వరుని విరిపాన్పు
రమ్మంటే వలపుల విందులకు!
వింత తళుకులూ విరిసేయి – ఏదో విశేష మీరేయీ
కదలవే మదను కొలువునకు ||చి||

## 17 కాలం మారింది

ఓం నమో నారాయణాయ!
ఓం నమో నారాయణాయ!
ఓం నమో నారాయణాయ!

ఆ శతసహస్ర ఘంటాహ్వానము నా కొరకేనా?
ఆ శతసహస్ర వీణాగానము నా కొరకేనా?
ఆ శతశతసహస్ర శంపాప్రభా దివ్యమూర్తి
నా కొరకేనా?

మందహాస మధురవదనా! శ్రీ సదనా!
ఇందురవినయన! ఫణిశయన! గోవిందా!
అరవింద భవవందిత పదనళిన! గోవిందా!
వందారు మునియోగి బృందా! ముకుందా!
బృందారకార్చితా! ఇందీవరశ్యామసుందరా!
భక్తప్రపన్న మందార! భువనాధారా!

ఏదీ, ఏదీ గంగ కడిగిన పాదకంజాతమేదీ?
మెత్తని రమాకరము లొత్తిన చరణ మేదీ?
నలువపుట్టిన నాభి నళినమేదీ? ఏదీ?
శ్రీవత్స కౌస్తుభ శ్రీనివాసమ్మేదీ?
జొనుగానీ కృపాధానీ! నీ ఉరమునం దేది
కలుములరాణి? ... ఏది జనని?

మందహాస మధురవదనా! శశివదనా!
విన్నానుగాని - కనుగొన్నాను - నేడు
నను, కన్నయ్యావని తెలుసుకొన్నాను నేడు!
నీ సన్నిధిని వీడి ఇంక కదలను!
నీ పాదముల క్షణమేని వదలను!
నీ మూర్తి నా చిత్తమును వీడి పోనీయను...
పోనీయను...

18

సాకి

పల్లె నిదురించేను – తల్లి నిదురించేను!
ప్రతిపాప తల్లి పొత్తిళ్ల నిదురించేను!
ఎవరికి నీవు కావాలి?
ఎవరికి నీమీద జాలి?
ఏ తల్లి పాడేను జోల?
ఏ తల్లి ఊపేను డోల?
ఎవరికి నీవు కావాలి?
ఎవరికి నీమీద జాలి?
ఏ తల్లి పాడేను జోల?
ఏ తల్లి ఊపేను డోల?
నీ ఇల్లు కొండలో కోనలో!
నీ బ్రతుకు ఎండలో వానలో!
లోకానికే నీవు దూరం!
లోకాల తల్లికే భారం!
ఎవరికి నీవు కావాలి...
కలువ పాపాయికీ కొలను ఒడి ఉన్నది!
చిలుక పాపాయికీ చిగురు ఒడి ఉన్నది!
ప్రాణమే లేని ఒక శిలకు గుడి ఉన్నది
పాపా నీకే... అమ్మ ఒడిలేనిదీ!... గుడిలేనిదీ!
ఏ నాడు చేశావు పాపం – నీకు
ఏ నాటిదీ క్రూరశాపం...
ఎవరికి నీవు కావాలి...

గోరింట 25

## 19 సంపూర్ణ రామాయణము

రామా లాలీ! మేఘశ్యామా! లాలీ!
తామరస నయనా! దశరథ తనయా లాలీ!

నిద్దరనైనా పెదవుల నవ్వుల ముద్దర లుండాలి!
తూగే జోలకు సరిగా ముంగురు లూగుచుండాలి!

ఇదే అమ్మ ఒడి ఉయ్యాల!
ఇదో నవరత్న డోల!

ఏది కావాలి!
ఎవ్వరు ఊపాలి?
ఎవ్వరు జోల పాడాలి?
నేనా? నేనో! నేనే!

ఎందుకు ఆ చందమామ?
ఎవ్వరీ విందుకోసమో, రామా?
శ్రీరామా – ఎందుకు ఆ చందమామ?

అందగాడనా నీకన్న? అందరాడనా ఓ కన్నా?
తరగని తగ్గని జాబిలి మా సరసనే ఉండగా,
కరగని, చెరగని పున్నమి మా కనులలో నిండగా
ఎందుకు ఆ చందమామ...

వేలెడంతలేడు – వేయివిద్యల దొర అయినాడు!
ఆ వీర బాలమూర్తి సొరు చూడు! చూడవే!
ఆ తండ్రిగారు మురియు తీరు చూడు!

చదువులకై గురువులకడ ఒదిగియుండు వినయము
అదెరా విల్లందుకొని అమ్ముపేయు వీరము
అన్ని గుణములెదురొచ్చి అయ్యను కొలిచేను!
రామయ్యను కొలిచేను!

పైన కొస్తే వెన్నెలౌను!
పందిరేస్తే మల్లెలౌను!

పడతి జానకి పెదవి పూస్తే పారిజాతాలు!
కన్నె జానకి మదిని దాస్తే సన్న సన్నని వలపులు!
లేతమావిడి పూత కోరు!
తీగపందిరి ఊత కోరు!

సీత కా శ్రీరామచంద్రుని చెలిమియే వైకుంఠము
ఆదిలక్ష్మి దేవి కా హరి అంతరం నివాసము

20

ఊరకే కొలను నీరు ఉలికి ఉలికి పడుతుంది!

ఓరగా-నెమలి పింఛ మారవేసుకుంటుంది!

ఎందుకో ప్రతిపులుగు ఏదో చెప్పబోతుంది!

వనములో చెట్టు చెట్టు కనులు విప్పి చూస్తుంది!

ఉండుండీ నా ఒళ్లు ఊగి ఊగి పోతుంది

అదుగో! రామయ్యే! ఆ అడుగులు నా తండ్రివే!

"ఇదిగో శబరీ శబరీ" వస్తున్నా నంటున్నవి!

కదలలేదు వెర్రిశబరి, ఎదురుచూడలేదని

నా కోసమె నా కోసమె నడిచి నడిచి నడిచీ

నా కన్నా నిరుపేద నా మహరాజు! పాపం అదుగో

అసలే ఆనదు చూపు!

ఆ పయి ఈ కన్నీరు!

తీరా దయచేసిన నీ రూపు తోచ దయ్యయ్యో!

ఏలాగో నారామా! ఏదీ? ఏదీ? ఏదీ?

నీల మేఘమోహనము నీ మంగళరూపము!

కొలను నడిగీ తేటనీరు,

కొమ్మనడిగీ పూలచేరు,

చెట్టు నడిగి పట్టు నడిగి
పట్టుకొచ్చిన ఫలాలు పుట్టతేనె రసాలు
దోరవేవో – కాయలేవో!
ఆరమగ్గిన వేవోగాని,
ముందుగా రవ్వంత చూసి
విందుగా అందియ్యనా

## 21 కళ్యాణ మంటపం

సరిగమ పదనిస నిదప మగరిస అని
పలికే వారుంటే, హృదయము తెరిచే వారుంటే,
వలచే మనసుకు బదులుగ, బదులుగ,
పిలిచే కనులకు ఎదురయి, ఎదురయి ||ప||

"ఒక కోవెలలో ఒకడే దేవుడు!
ఒక హృదయములో ఒకడే ప్రియుడు!
జీవననేత, ప్రేమవిధాత"
అను గుడిగంట! విను ప్రతిజంట! ||ప||

"తీగా తీగా పెనగీ పెనగీ.
రాగధారగా సాగీ సాగీ,
జీవన గంగావాహిని కాదా!"
అను ప్రతి జంట! విను గుడిగంట! ||ప||

## 22

చుక్కలు పాడే శుభమంత్రం!

దిక్కులు నిండే దివ్యమంత్రం!
ఎక్కడనో, ఎపుడో, ఎవరో
పలికిన వేద మంత్రం!
ఇక్కడనే ఇపుడే ఎవరో – నా
చెవిలో ఊదిన మంత్రం, మధు మంత్రం ॥చు॥

రెక్కలపై ఆ గువ్వలజంట,
రేకులలో ఆ పువ్వులజంట,
సాగుచునే, ఊగుచునే,
మధుర మధురముగ, మక్కువగ,
చదువుకునే ఆనంద మంత్రం ॥చు॥

కన్నులు ఒకపరి మూసుకొని – నీ
వన్నది మరి మరి తలచుకొని,
ఒక్కతెనే – నేనొక్కతెనే
అదే పనిగనే సదా మనసులో
ఆలపించే ప్రియ మంత్రం ॥చు॥

కోవెల దైవం పిలిచే దాకా,
ఆవలి ఒడ్డున నిలిచే దాకా,
నాలోనే లోలోనే
"నాతి చరామి నాతి చరామి" –
అది నా ప్రాణ మంత్రం ॥చు॥

## 23 భక్త తుకారాం

తుకారాం

హరి ఓం! హరి ఓం! హరి ఓం!

ఘనాఘన సుందరా! కరుణారసమందిరా!
అది పిలుపో, మేలు కొలుపో,
నీ పిలుపో, మేలు కొలుపో!
అతి మధుర మధుర మధురమౌ ఓంకారమో!
పాండురంగ! పాండురంగ!
ఘనా ఘనా సుందరా...

ప్రభాత మంగళ పూజావేళ,
నీ పద సన్నిధి నిలబడి,
నీ పద పీఠిక తలనిడి,...
నిఖిల జగతి నివ్వాళు లిడదా!
వేడదా! కొనియాడదా!
పాండురంగ! పాండురంగ!
ఘనా ఘన సుందరా...

గిరులూ, ఝరులూ, విరులూ, తరులూ
నిరతము నీ నామ గానమే!
నిరతము నీ రూప ధ్యానమే!
సకల చరాచర లోకేశ్వరేశ్వరా!
శ్రీకరా! భవహరా! పాండురంగ! పాండురంగ!
ఘనా ఘనా సుందరా...

# విజయం మనదే

శ్రీరస్తు చిన్నారి నా చెల్లికి
చిరాయురస్తు వరాల మా తల్లికి
కొంచెం కొంచెం బిడియాలు,
పొంచి పొంచి సరదాలు,
మామంచి పెళ్ళికూతురికి— మగనింటికి పోయే
తొందరలు!
శ్రీరస్తు —శుభమస్తు
కనుదోయి కాటుక తీర్చి,
కస్తూరి తిలకం దిద్ది,
కన్నీటి తెరలో నుంచే, కళ్యాణమూర్తిని చూసి,
ఆ మూర్తి నాలో దాచి,
ఆ కంట నీరు రాకూడదు!
ఈ గుండె చెదరి పోగూడదు!

ఈ జంట కలిసి వెళ్ళే వరకు, నాచెల్లి వెంట ఉండాలని
వెంట వెంట ఉండాలని,
పుట్టినింటి మహరాణియని—
మెట్టినింటి యువరాణియని
ఒట్టువేసి చెయిలో చెయి వేసి—
అత్తచేత ఉంచాలనీ — అతని వెంట పంపాలని

## 25 మంచిరోజులు వచ్చాయి

నేలతో నీడ అన్నది నను తాకరాదని!
పగటితో రేయి అన్నది నను తాకరాదని!
నీరు తన్ను తాకరాదని గడ్డిపరక అన్నది!
నేడు భర్తనే తాకరాదని ఒక భార్య అన్నది!

వేలి కొసలు తాకనిదే వీణ పాటపాడేనా?
చల్లగాలి తాకనిదే నల్లమబ్బు కురిసేనా?
తల్లి తండ్రి ఒకరినొకరు తాకనిదే
నీవు లేవు, నేను లేను, లోకమే లేదులే

నేలతో......

రవి కిరణం తాకనిదే నవకమలం విరిసేనా?
మధుపం తను తాకనిదే మందారం మురిసేనా?
మేనుమేను తాకనిదే, మనసు మనసు కలవనిదే,
మమతలేదు, మనిషిలేదు, మనుగడయే లేదులే

నేలతో.........

అంటరానితనము–ఒంటరితనము
అనాదిగా మీ జాతికి అదే మూలధనము
ఇక సమభావం, సమధర్మం సహజీవన మనివార్యం,
తెలుసుకొనుట మీధర్మం, తెలియకుంటె మీ కర్మం

నాగిని

ఓమ్! హరా పురహరా! —హరా ! శంకరా
హరా! సౌర గంగాధరా!
గిరిజా మానస కమల మధుకరా!
బాల చంద్ర కోటీరా! ఓమ్! ఓమ్! ఓమ్!

సాకీ

ఒక్క నాగిని, పినాకియౌ మహేశుని గూర్చి
చెక్కు చెదరక తపము చేసే
పెక్కుయుగములు తపముచేసే, తపముచేసే!

నాగిని

చంద్రశేఖరా రారా
పిలిచి పిలిచి అలసినారా—చంద్రశేఖరా! రారా
నాగినిరా, అనురాగినిరా, నీ గుణమెరిగిన భోగినిరా
కరుణాసదనా! కదలి రారా!
కన్నులారా కాంచువరకు కదలను
నిన్నుగాక వేరువరముకోరను! రారా!

చంద్రశేఖరా...

నేతవులే వరదాతవులే—నీవే జీవ విధాతవులే
భువన మోహన మూర్తివిలే
కొండపైని మింటిపైని కొలుపై
సురలకేని మునులకేని దొరకవురా! రా!

చంద్రశేఖరా.....

ఏ కాలికి కడియం కావాలనీ,
ఆ కేలికి కంకణ మవాలనీ,
ఆ కంఠంచుట్టూ మాలికనై ఒక డోలికనై ఊగాలనీ
కోరికరా! వేడెదరా! నీదయరా!

# 27 వాడే వీడు

ఎదుటనుంచి కదలను!

పదము లింక వదలను!
కళ్ళకు నాచిన్నతండ్రి
కనిపించే తీరాలి....

ఎదుటనుంచి కదలను....

కల్లగాదు నాకల!
కలకానెకాదు నీ దయ!
అల్లదిగో, వానిపిలుపు "అమ్మా అమ్మా" అంటు
ఇల్లిదిగో, కన్నకడుపు "రా తండ్రీ రా" అంటూ
ఎదుటనుంచి కదలను....

ఎండా వానల తిరిగి ఎంత బెదరిపోయాడో!
తిండీ తిప్పలులేక ఎంత నలిగిపోయాడో!
అదుముకొని నాగుండెకు, పదిలంగా దాచుకొని,
కదలనీను నా బిడ్డను ఇహ నా చేతులనుండి....
ఎదుటనుంచి కదలను...

తల్లి మనసు నీకు తెలియదా, తల్లుల
తల్లివి, నాపాలి పాలవెల్లివి గాదా!
అదుగో! అవునంటూ ఆ చల్లనిచూపు!
అదుగో నన్నాదుకునే అభయహస్తము.....
ఎదుటనుంచి కదలను....

28

చెల్లి

నేటికి మళ్ళీ మా యింట్లో ఎంచక్కా పండుగా
ఏటేటా నూరేళ్ళా మళ్లీ మళ్లీ పండుగా—

తల్లి

తొలిదీపం వెలిగించిన రోజు
ఇలవేలుపు దిగి వచ్చిన రోజు ॥నే॥

చెల్లి

ముంగిట్లో మందారం మురిసిమురిసి నవ్వింది

తల్లి

నట్టింట్లో యీమోడు తిరిగి చిగురు తొడిగింది
నినుచూసి నన్నుచూసి మనభాగ్యం చూసిచూసి ॥నే॥

కొడుకు

ఇన్నాళ్ళకు కనుగొన్నాను
కన్నతల్లి కారుణ్యం!
మా చిన్నిచెల్లి అనురాగం!
ఈ గుడిలో దివ్వెగనైనా,
ఈ గూటిలో గువ్వగనైనా,
ఇల్లువిడిచి పోలేను—
ఈ వరము వదులుకోలేను— ॥నే॥

# 29 నేరము-శిక్ష

చేసిన పాపం నీది!
చితికిన బ్రతు కింకొకరిది!
ఒకరిదా నేరం – వే
రొకరికా శిక్ష?
దిక్కులేని దీన అదిగో!
రెక్కతెగిన పక్షి అదిగో!
అక్కటా! గూడైన లేదు!
ఎక్కడా ఒక తోడు లేదు!
ఏమి టింత దారుణం?
దీని కెవ్వరు కారణం?

కన్నుల వెలు గారిపోయె!
ఉన్న ఊత జారిపోయె!
ఊరులేదు వాడలేదు,
దారియేదీ కానరాదు!
ఏమి టింత దారుణం?
దీనికెవ్వరు కారణం?
చేసిన పాపం నీది!
చితికిన బ్రతుకింకొకరిది!
ఒకరిదా నేరం–వే
రొకరికా శిక్ష!

## 30 రాముడే దేవుడు

రామా! ఓ రామా!
రావా! కనరావా!
నా మనసు చల్లగా – నా బ్రతుకు ఝల్లన
రామా! ఓ రామా!

ఎందుకు రామా ఈ కనులు! నీ
సుందర రూపం జూడని నాడు!
ఎందుకు స్వామీ ఈ మేను! నీ
ముందర నిలిచి కొలువని నాడు?
ఏదీ....ఏదీ....నీ సన్నిధీ!
ఏదీ....ఏదీ....నా పెన్నిధీ....
రామా ! ఓ రామా!

చీకటి వేళల నడిపించేదీ
ఒంటరి ఘడియల వినిపించేదీ
ఏదీ....ఏదీ....నీ చేయూత?
ఏదీ.....ఏదీ....నీ పిలుపు?
రామా ! ఓ రామా!

## 31 ధనవంతులు – గుణవంతులు

తెరచి యుంచేవు సుమా
పొరబడి నీ హృదయము!
బిరబిర ఏ సుందరియో
చొరబడితే ప్రమాదము! తెరచి.......

పూలవాకిళ్ళ తుమ్మెదలు
పొంచి ముసిరేవేళ,

నేలపై దిగి అచ్చరలు
లీలగా తిరిగేవేళ,

ఆదమరిచి నిదరోయినా
హాయి కలలలో మునిగినా
ఆపద సుమ్మా .......... తెరచి...

కన్నుదోయి నల్ల కలువలుగా
కనుపించు ప్రాయము నీది,
సన్నజాజి పువ్వు నవ్వులనీ
అనిపించు భావన నీది–
చీరచెరగు గుసగుస మన్నా,
కాలిఅందియల సడి విన్నా
చిక్కులు సుమ్మా తెరచి...

## 32 జీవితాశయం

అవునా! పాడనా!
హాయిగా! ఆనందముగా!

గొంతు పాడితే చాలునా?
గుండెలో రాగముండాలి!
మాటలాడగానే సరా?
మనసులో నిజం పలకాలి!

మెరిసే కన్నుల మాటున
ఏ అశ్రులు పొంచున్నాయో,
విరిసే నవ్వుల చాటున
ఏ మబ్బులు ముసిరున్నాయో!

ఎవరిలో ఏమి దాగుందో,
ఏ బ్రతుకున కే మలుపుందో,
ఎరిగిన దాకరే ఒకరు!
తెరవెనుక దాగి దొరకరు! ।గా।

వలచే తుమ్మెద ఒకటి! దవ్వుల
కాలిచే తుమ్మెద వేరొకటి!

దాచిన తేనెలు ఎవరికో, విర
బూచిన తావులు ఎవరికో,
ఎవరికో!

ఎరిగిన దొకరే ఒకరు!
తెరవెనుక దాగి దొరకరు! ||గా||

జరిగిందీ, జరుగనున్నదీ,
పరికించీ పాలించేదీ,
ఉడికించీ నిన్నూ నన్నూ
బొమ్మల్లా ఆడించేదీ,

కరుణించే దొకరే ఒకరు!
తెరవెనుక దాగి దొరకరు! ||గా||

33

# అమ్మ మనసు

రాజు

శ్రీశైలభవనా మేలుకో
శ్రితచిత్తసదనా మేలుకో
తూరుపున బంగారురేకలు తోచె!
చేరువున పొందామరలు విరబూచె!

పిల్లలు

సుప్రభాతము—శుభకరమూ!

రాజు

చిట్టిపొట్టి పిచికలు లేచారా?
చిన్నపూల మొలకలు చూచారా?
గోడపై కోడిపుంజు కొక్కొ్కరొకో అంది
గూటిలో కాకిపిల్ల 'కా,కా,' అంది!
'సుప్రభాతము – శుభకరమూ...

రాజు

మడుగులో కప్పలెవరు?

పిల్లలు

బెక...బెక...బెక...బెక...

రాజు

చెరువులో చేపలెవరు?
టోయ్.....టోయ్....టోయ్....టోయ్....

రాజు

మడుగులో కప్పలైతే, చెరువులో చేపలైతే
దిప్పకాయ పిల్లలకు, ఉడుకుడుకు నీళ్లు!
చెప్పినట్టు వింటే – చిట్టుడుకు నీళ్ళు!
సుప్రభాతము – శుభకరమూ...

మాధవి

పాహిమాం...పాహిమాం....జగదేకబంధూ...

రాజు – పిల్లలు

పాహిమాం...పాహిమాం...కారుణ్యసింధూ...

మాధవి

పతితపావనా! దీనజనావన!

ప్రేమ నిధానా! పాహిమాం .....

నీ ఒడిలో ఒదిగే పాపలం...

రాజు – పిల్లలు

పాహిమాం...పాహిమాం...

మాధవి

నీ అడుగుల వాలే పూవులం!

రాజు – పిల్లలు

పాహిమాం...పాహిమాం...

నీ దయవుంటే – నీ సెలవైతే – నీగుడిలో వెలిగే దివ్వెలం

పతితపావనా దీనజనావన ప్రేమనిధాన పాహిమాం....

రాజు

ఎన్నేళ్ళమ్మా –ఎన్నేళ్ళు?
చిన్నారి బాబుకు – ఎన్నేళ్ళు?

మాధవి

కన్నతల్లికె తెలుసు – ఎన్నేళ్ళో
కన్నీళ్ళకే తెలుసు – ఎన్నేళ్ళో! ఎన్నేళ్ళమ్మా...

రాజు

ఏడుకొండలవాడు –కాపాడుతుంటే
ఏడేడు కలిసీ, నూరేళ్ళు!
విడువని తల్లీ – అలుమేలు తల్లీ–
వేయేళ్ళంటే–వేయేళ్ళు–

మాధవి

అమ్మకడుపు చల్లగా – అత్తకడుపు చల్లగా
అంతకంతగా పెరిగి – వర్ధిల్లు ఎన్నేళ్ళమ్మా....

రాజు

చిన్ని కృష్ణమ్మకు – జిలుగుపట్టు షరాయి –
చిలిపి గోపాలునకు – తళుకు నెమలి తురాయి–
ఇందరిలో ఈనాడు – అందాల పాపాయి
యశోదమ్మ కన్నయ్యవు.... నీవేనోయీ...

మాధవి

కన్న ఆ దేవకీ కన్నీటిపాపాయి
ఇదే పట్టుషరాయి—ఇదే నెమలితురాయి                ఎన్నేళ్లమ్మా...

చిరుబుగ్గల నీతల్లి చెక్కిట ఆనించి-
ఏదీ, ఒక్కసారి అమ్మా అను!
చిట్టిచేతులు, చుట్టూ గట్టిగ పెనవేసీ,
ఏదీ, ఒక్కసారి అమ్మా అను!

35

అరె, చిక్‌చిక్ చిక్‌చిక్ రైలుబండీ!

అది, చకచక చకచక వెళ్తుందండీ... రైలుబండీ...

విజయ – రాజు

పప్పూ బువ్వా తిన్నావంటే, తిన్నావంటే
పండరిపురమే వెళ్ళొచ్చు – వెళ్ళొచ్చు
పాండురంగని చూడొచ్చు

రాజు

పాలూ మీగడ పెట్టొచ్చు...

విజయ

జైజై విఠలా...

రాజు

పండరినాథా.........

జైజైవిఠలా...

రాజు

పాండురంగా...కూ...కూ... అరె చిక్‌చిక్

విజయ

బుద్ధిగ నువ్వు బజ్జున్నావా,
బృందావనమే వెళ్ళొచ్చు...

రాజు

బుజ్జి కృష్ణునీ చూడొచ్చు...
బోలెడు వెన్న అడగొచ్చు...

విజయ

తారంగం—తారంగం

రాజు

తాండవకృష్ణా తారంగం

అరె చిక్‌చిక్...

రాజు

చప్పుడు చేయక రావాలీ
చెప్పినట్టుగా చేయాలి...

విజయ

ఏమిటి

రాజు

దానిససస సరిసదసనిసస
పాదని నినిదని నిదని సదనిస

విజయ

వేళాపాళా ఉండాలి
వెర్రికి హద్దు ఉండాలి....

## 36 మట్టిలో మాణిక్యం

మాట చాలదా
మనసు చాలదా
మాటలోని మనసులోని
మమత తెలియదా
చుక్కలు వినగా
దిక్కులు కనగా
ఒదిగి దాగే మధుర రహస్యం ॥మా॥
తోటలో పూచెవిలో
తుమ్మెద ఊదేది
గూటిలో ప్రియునితో గోరింకా అనేది
కన్నులలోనా నవ్వులలోనా
మక్కువ గొలిపే మధుర రహస్యం ॥మా॥
ఒకరికై నా గుండెలో ఎప్పుడూ వసతి
ఒక్కరే నా ప్రేమకు ఏ నాటికి అతిథి
పదిలము గానా హృదయములోనా
ఒదిగి దాగే మధుర రహస్యం ॥మా॥

## 37 చీకటి వెలుగులు

ఆమె

చీకటి వెలుగుల కౌగిటిలో
చిందే కుంకుమ వన్నెలు!

అతడు

ఏకమైన హృదయాలలో
సాకే బంగరు రంగులు!

ఇద్దరూ

ఈ మెడ చుట్టూ గులాబీలు!
ఈ సిగపాయల మందారాలు!

ఆమె

ఎక్కడివీ రాగాలు?
చిక్కని యీ అరుణ రాగాలు?

అతడు

అందీ అందని సత్యాలా?
సుందర మధుర స్వప్నాలా?

ఆమె

తేటనీటి యీ ఏటి ఒడ్డున
నాటిన పువ్వుల తోట!

అతడు

నిండు కడవలా నీరు పోసి,

ఆమె

గుండెల వలపులు గుమ్మరించి,

అతడు

ప్రతి తీగకు చేయూత నిచ్చి,

ఆమె

ప్రతిమానూ పులకింప జేసి,

ఇద్దరూ

మనమే పెంచిన దీ తోట!
మరి ఎన్నడు వాడని దీ తోట!

ఆమె

మరచిపోకుమా తోటమాలీ!
పొరబడియైనా మతిమాలీ!

అతడు

ఆరు ఋతువులూ ఆమని వేళలె మన తోటలో!

ఆమె

అన్ని రాత్రులూ పున్నమిరాత్రులె మన మనసులో!

అతడు

మల్లెలతో వసంతం,

ఆమె

చేమంతులతో హేమంతం,

అతడు

వెన్నెల పారిజాతాలు,

ఆమె

వానకారు సంపెంగలూ,

ఉభయ:

అన్నీ మనకు చుట్టాలే!

ఆమె

వచ్చిపోయే అతిథులే!

ఇద్దరూ

ఈ మెడచుట్టూ గులాబీలూ!
ఈ సిగపాయల మందారాలూ!

అతడు

ఎక్కడివీ రాగాలూ

అతడు

చిక్కని యీ అరుణ రాగాలు
గల గల మన గూడదు ఆకులలోగాలీ!
జలజల మనరాదు అలలతో కొండవాగూ!
నిదరోయే కొలను నీరు కదపగూడదు!
ఒదిగుండే పూలతీగ ఊపరాదు!

అతడు

కొమ్మపై నిట జంట పువ్వులు!
గూటిలో ఇట రెండు గువ్వలూ!
ఈ మెడ చుట్టూ గులాబీలు!
ఈ సిగపాయల మందారాలు!
ఎక్కడివీ రాగాలు
చిక్కనీ యీ అరుణ రాగాలు

అతడు

మరచిపోకుమా తోటమాలీ—
పొరపడి యైనా మతిమాలి!

కుశలమా? నీకు ? కుశలమేనా?
మనసునిలుపుకోలేక
మరీమరీ అడిగాను అంతే....అంతే...అంతే...

ఆమె

కుశలమా మీకు?కుశలమేనా?
ఇన్నినాళ్లు వదలలేక,
ఏదో ఏదో వ్రాశాను అంతే...అంతే...అంతే

అతడు

చిన్న తల్లి ఏమంది?

ఆమె

నాన్న ముద్దు కావాలంది

అతడు

పాలుగారు చెక్కిలిపైన పాపాయికి ఒకటి!
తేనెలూరు పెదవులపైన దేవిగారి కొకటి

ఆమె

ఒకటేనా...ఒకటేనా..
ఎన్నైనా...ఎన్నైనా

ఆమె

మనసు నిలుపు కోలేక మరీ మరీ అడిగాను
అంతే..అంతే..అంతే..
కుశలమా నీకు కుశలమేనా

అతడు

పెరటిలోని పూలపాన్పు

ఆమె

త్వర త్వరగా రమ్మంది

అతడు

పొగడ నీడ పొదరిల్లో

ఆమె

దిగులు దిగులుగా ఉంది ఎన్ని కబురులంపెనో...
ఎన్నికమ్మలంపెనో..
పూలగాలి రెక్కలపైనా నీలిమబ్బు పాయలపైనా
అందేనా... ఒక్కటైనా

అతడు

అందెనులే... తొందర తెలిపెనులే

అతడు

ఇన్నినాళ్ళు వదల లేక
ఏదో ఏదో వ్రాశాను
అంతే... అంతే...అంతే... కుశలమా...

# 39 సంఘంమారాలి

నీవా దేవి నీవేనా ఈ వేయిస్తంభాల
దేవాలయాన నీవా దేవి నీవేనా

కలవు కాదుగద కరిగిపోవుగద
కలలా తీరా కదలి పోవుగద
దేవి దేవి నీవేనా

ఔనూ నీదేనే నెరిగినదే
ఆ విరిగిన పెదవుల విరిసిన నగవూ
ఆహా నీదే ఆ ఒరిగిన లతవలె
ఒంపుల మేను ఎదురుగ నిలచీ
ఎదలో పిలిచి ॥నీవా॥

నేనే నిన్నే ఆ రాతిని చెక్కితి చక్కని నాతిగా
నేనే నిన్నే ఈ తీగను నొక్కితి
చక్కెర గీతిగ ఎదురుగ నిలిచి
ఎదలో పిలచీ ॥నీవా॥

# 40 ఇదెక్కడి న్యాయం

ఎపుడైన ఒక క్షణమైనా
ఏకాంత దర్శన మీవా
ఎదురెదురుగా ఎదురెదురుగా
నీవూ నేనే నేనూ నీవే ॥ఎపుడైనా॥

ఈ చిరుగాలిలో ఏమున్నదో
ఈ పరిమళము ఏ తోటదో
నిలువదు నాలో ఈ హృదయం
పలువరించుచు పరుగిడు నీ కోసం ॥ఎపుడైనా॥

విను విను ఝుమ్మను తుమ్మెదలా – నిను
మరి మరి రమ్మను తీగలా
నాపై కురిసే పున్నమి వెన్నెలా – ఇవి
నాలో పొంగె నీ ప్రేమ జల్లులా ... ॥ఎపుడైనా॥

ఎపుడైన యే క్షణమైనా
ఏకాంత దర్శన మేలా
ఎదురెదురుగా ఎదురెదురుగా
నీవూ నేనే నాలో నీవే

41

# ఇల్లే స్వర్గం

మేలుకోరామ! నన్నేలుకో శ్రీరామ!
నాలోన కొలువైన నా దైవమా
నా ప్రాణమా మేలుకో
నన్నేలుకో శ్రీరామ! మేలుకో రామ! ||మే||

దారిపొడుగున చలువ పందిరులు వేసి
కారు రాతిరి నిండు వెన్నెలలు పూసి
కూడా, కూడా, ఉండి, తోడుగా, నీడగా
నిలిచినది ఈ జానకి
ఎప్పటికీ నిలువగలదీ జానకి...! ||మే||

ఒక మనసు నొవ్వక, ఒక గుండే అలయక
ఒక కంట రవ్వంత, తడియురానీక
ఒక పొరగాని, చీకటి చారగాని
చొరబడక తన యిల్లు స్వర్గమ్ము చేసి
నిలిపినది ఆ జానకి
ఎప్పటికీ నిలువగలదీ జానకి! ||మే||

42

చీకటి తెర తొలగింది

వేకువ వెలిగించే, దేవీ నీవెవరో, నేనెవరో...
అల వాణివో, హరిరాణివో, కళ్యాణివో
వెలుగులిచ్చి నానీవే, కలుములిచ్చి నానీవే
కళకాంతులిచ్చినా – నీవే, నీవే

మండు ఎడారిని మధువనిగా
నరకమును దివ్య స్వర్గమ్ముగా... మలచి
ఈ యింట ప్రభాత కాంతి తోరణమలల్లె నావుగా
ఎంత ఓరిమి, ఎంత కూరిమి...

వలచే... ప్రియురాలివో
కొలిచే.. ఇల్లాలివో
దయదలచే తల్లివో
ఈ వీటికి చీకటి రానీకు
ఏ నాటికి వేకువ పోనీకు

## 43 సమాధి కడుతున్నాం చందాలివ్వండి

యుగయుగాలకొక విశ్వజ్యోతి
ఎగివచ్చెను ఒక కారుణ్యమూర్తి
అంధకారమ్ము మరీ దిక్కులనే
అలముకొన్నప్పుడు లోకరక్షకై ||యుగయుగాల||

రాచనగరు భోగం... రమణి మధుర రాగం
అగరు పొగలు అత్తరులు సోయగించు వలపు తొలకరులు
వెన్నకన్న మెత్తన – వెలదియశోధర కౌగిలి
వెన్నలా కన్నా చల్లనా... చిన్ని కొమరుని మోము జాబిలి..
||రాచనగరు||

అన్నింటినీ వదలి ఒకనాడు కదలి...
ఏ మౌన వాణి ప్రబోధించెనో గాని...
యువరాజు సిద్ధార్థుడొక చెలికానితో
వీక్షింపబోయె పురవీధులను... వింతలను ఆ...
అయ్యో... య్యో...మొయ్యలేని బరువు బ్రతుకు
దేనికొరకు?
ఒక క్షణం – జరగదు... దిక్కులేని పక్షికి...
ఈ రెక్కలుడని పక్షికీ...? ||అయ్యో... య్యో||

ఇది కాలేనా... ఇది కాలేనా మరివెళ్లేవి పాపం
అది మానవుని రూపేనా.. అటుపోరేమి.. ఆవైపైనా..
ఒక్కరైనా .. ఒక్కరైనా..
అయ్యో(..ఉన్నదీపమారిపోయి – ఒక్కసారి చీకటాయె
ఎవరినింక హత్తుకోగలను – ఈపగిలిన గుండెను
ఈ ప్రాణము పోయిన కట్టెనా.. నాముద్దుల పట్టినా..నా
ముద్దుల పట్టినా..
ఊరేగనులేక ..ఉల్లాసమూలేక
అడుగు పడనూపడక..ఆగి అరయనూలేక..
మరలెనింటికీ..ఆ మహరాజుబిడ్డ.. ఆమహారాజుబిడ్డ
బ్రతుకు దారికిటూ అటు భాష్పధారలేనా.. అవి
వేలుపున్నములు పండీ.. పండీ..
పాలకడలి తనలోనిండి..
యుగయుగాలకొక విశ్వజ్యోతి...
దిగివచ్చెను ఒక కారుణ్యమూర్తి
బుద్ధం శరణం గచ్ఛామి.. ఆ(...
సంఘం శరణం గచ్ఛామి...ఆ(..
ధర్మం శరణం గచ్ఛామి...ఆ(...

# 45 ఈనాటి బంధం ఏనాటిదో

ఎవరు నేర్పేరమ్మ ఈ కొమ్మకూ
పూలిమ్మనీ రెమ్మరెమ్మకూ
ఎంత తొందరలే హరి పూజకూ
ప్రొద్దు పొడవక ముందె పూలెమ్మనీ ॥ఎవరు॥

కొలువైతివాదేవి నా కోసమూ ....తులసీ.....
తులసీ దయా పూర్ణ కలసీ
మల్లెలివి నా తల్లి వరలక్ష్మికీ
మొల్లలివి నన్నేలు నా స్వామికీ ॥ఎవరు॥

ఏ లీల సేవింతు
ఏమనుచు కీర్తింతు
సీత మనసే నీకు సింహాసనం
ఒక పువ్వు పాదాల
ఒక దివ్వెనీ మ్రోల
ఒదిగి నీ ఎదుట ఇదె వందనం
ఇదె వందనం

వసివాడి నశిచెడి వన్నెవాసి లేక
విరహాన వనలక్ష్మి వేగిపిలుచూ
పగిలి గుండెల దాక పొగలతో సెగలతో
దాహాన భూదేవి తపయించి పిలుచూ
రా, తొరతొరగా రా... తొందరగా రా
ఓ దూరగగన విహారా – ఓహో శీతల వర్షాధారా

తరలిరా–జలధరా
కరుణించి కదలిరా
వడివడి తొలకరి జడులు కురిపింపరావా
ఒడలు ఈ పుడమి ఒడలు పులకింపరావా ॥తరలిరా॥
మోరలు మింటికి చాచి మయూరము లివిగో – ఇవిగో
బారుబారులై పారు బలాకము లవిగో–అవిగో
నీ దారికాచి నీరాకవేచి నీ చల్లని జల్లులకై ॥తరలిరా॥

సాగర జలముల హరియించి
సమీర రథము నధిరోహించి
గిరిశిఖర మౌళిపై కాలుంచి
ఖరకిరణ హేళి నాచ్ఛాదించి
సుమలతపైన, ఫలతరులపైన
అమృతాల సోన వెదజల్లగ

పరిమళ్ళ పైన, పెనుబీళ్ళపైన
వడగళ్ళ వానకురియగ ॥తరలిరా॥

సురనారీ సుందర తరకబరీచ్ఛాయలా చీకటి పాయలా
రంభాది దివిజ రాగిణీ రత్నమేఖలలా చంచలలా
శక్రచాప వక్రాందోళికపై ఎక్కి రాజువలెరా ॥తరలిరా॥

మత్తకుంభి ఘీంకారములా
ఉన్మత్త వాతహుంకారములా
శత సహస్రహయ హేషలా
మహోద్ధిత గర్జిత ఘోషలా
మహానట జటా ఘటోద్ధితగంగా
తుంగ తరంగ మృదంగ ధ్వనులా
నిఖిల జగతి ఒనరంగా హర్షం
నింగినేలకలియంగా వర్షం
తొరగి తొరగి గగన పథము నుండి
కురిసి కురిసి ఝురులు ఝురులు నదులై
పొరలి పొరలి సుడులు నడులు వరదలై

వీణా నా వీణా

ఎరుగుదువా నీవైనా
నన్నెరుగుదువా నీవైనా
నాప్రాణ సఖివిగానా
ఏ చేయి నిను లాలించేనో
ఏ హృదయము నిను పలికించేనో
ఈ వింతగానము ఎక్కడిదో
ఏ మధుర రహస్యాలాడేవో
ఎరుగుదువా నీవైనా
ఎరుగుదురా – మీరైనా

ఏ పూర్వస్మృతులో – కదిపేవుసుమా
ఏ పూర్వరాగాలో – రేపేవుసుమా
పిలిచి–పిలిచి–వెనుతగులు తొందరలు
తరిమి–తరిమి– వడలనవి మాధురులునేవి
ఎన్ని లోకాలుదాటినా–
ఎన్నెన్ని జన్మలను ఎత్తినా
పిలిచి–పిలిచి వెనుతగులు తొందరలు
తరిమి–తరిమి వదలనీవి మాధురులు నీవి

48

మనసు తీరక గాక సీకీ

సొగసు చేతలి వెందుకే–ఎవ్వరి విందుకే
పగలు వగలూ ఏల మానవరత్న సుందరమాలా
కళ్ళతో కొత్త చూడనీ వరహాల తల్లీ – మళ్ళీ –మళ్ళీ
ఈ నాన్నను – ఈ అమ్మను –ఏల వదలి వెళ్ళగలవే
రాకేందుకునావదనా – లావణ్యాసదనా – రాజీవనయనా
రాయంచ నడకలదానా – ఓ చానా ...
ఎన్ని పున్నము లిచట పండెనే
ఎన్నెన్ని అమృతపు జడలు నిండెనే
కంట తడి వలదందువే తల్లి
కలత పడవలదందువే మా తల్లి
ఏ దేవివోగాని – ఎచటికో నీ పైనము
కైలాసమో ఆ పైలోకమో
రాకేందువదనా – లావణ్యాసదనా
రాజీవనయనా – రాయంచనడకలదానా – ఓచానా ఓచానా
ద్వేషమొక్కింతైనా లేక రోషమావంతైనరాక
ఈ జగతి అంతా చల్లనగు సంసారముగ నిలపాలి
మధుర కరుణా సుధామూర్తీ
మా హృదయవర్తీ .. తల్లీ .. తల్లీ!

49

# సన్నాయి అప్పన్న

కరిగించు ఈ కలికి హృదయం
కదిలించు నా కాలిగజ్జెల కడియిం
వినిపించు నాలో ఏదో వింత సన్నాయి
అనిపించు ఈ రేయి అనుకోని హాయి – మనసున ఒదిగిన
||కది||

మమత లెల్ల మధు ధారలై పొరల
నేనే నీవయిపోయి – నీవే నేనయిపోయి
సన్నాయిపై వేళ్ళు నాట్యాలు చేయాలి
సరిగజ్జె మువ్వలూ రాగాలు పాడాలి
గలగలలు సరిగమలు కరిసిపోయి – సెలయేరువై పొంగ
||కరి||

ఇది నా హృదయం
ఇది నీ నిలయం
ఇది సురముని యోగీశ్వరులు చూపులకు అందని ఆనందనిలయం
॥ఇది నా॥

ఇది నా శ్రీనివాసం
ఇది నా రాణివాసం
నాపైనీకింత అనురాగమా
నాపై నీకింత ఆధారమా
ఇది నా ప్రణయడోల ॥ఇది నా॥

ఇది నా ప్రభువు లీల
ఎల్ల లోకములు ఏలే వారికి
ఈడా .. జోడా .. ఈసిరి
నీకుంతీ పురిలో విభువక్షస్థలి
విడిది చేయు నా దేవేరి
ఇది నా భాగ్యం
ఇది మన భోగం ॥ఇది నా॥

51

ఈపల్లె ప్రేపల్లె
ఈ ఇల్లు నీ ఇల్లె
ఇదిగో నీ తల్లి
ఏది .. అమ్మా .. అమ్మా .. అను మళ్ళీ .. మళ్ళీ
॥ఈ పల్లె॥

నల్లమబ్బు మెయి సొగసులా
పుల్ల కమల నయనాలా
మల్లెపూవు చిరునవ్వులా
ఏమి .. మళ్ళీ .. మళ్ళీ .. అమ్మా .. అమ్మా ..
అనుమళ్ళీ .. మళ్ళీ ॥ఈ పల్లె॥

## 52

ప్రభూ ఓ ప్రభూ
రావైనా రావు – ప్రభూ
రమ్మని అయినా అనవు
నా పిలుపే నీకందదా
నీ తలపే నాపై మరలదా ॥ప్రభూ॥

నీ హృదయం నా నిలయమని
అన్యులకందని ఆలయమని
ఎన్నో తీయని బాసలు
ఎన్నెన్నో చల్లని మాటలు
ఏవో మదిలో మెదలు
ఇవి వీడని తలపులు ॥ప్రభూ॥

అవి మారదూర స్మృతులేనా
అవి మధుర మధుర స్వప్నాలేనా
అ పారిజాత సుమపరిమళాలు
అ వనమాలికా సౌరభాలు
ఏది నా శ్రీనివాసం
ఏది నా రాణివాసం
ఏది నా ప్రణయడోల
ఇది నా ప్రభువులీల

# 53 గోరింటాకు

గోరింట పూచింది కొమ్మలేకుండా
మురిపాల అరచేత మొగ్గ తొడిగింది
ఎంచక్క పండిన ఎర్రని చుక్క చిట్టి పేరంటాలికి
శ్రీరామరక్ష
కన్నె పేరంటాలికి కలకాలం రక్ష ॥గోరింట॥

మామిడీ చిగురెరుపు మంకెన పువ్వెరుపు
మణులన్నింటిలోన మాణిక్యం ఎరుపు
సందె ఎన్నెల్లోన సాగే మబ్బెరుపు
తానెరుపు అమ్మాయి తనవారిలోన ॥మామిడి॥

మందారంలా పూస్తే మంచి మొగుడొస్తాడు
గన్నేరులా పూస్తే కలవాడొస్తాడు
సిందూరంలా పూస్తే చిట్టిచేయంతా
అందాల చందమామ అతనే దిగివస్తాడు ॥మందా॥

పడకూడదమ్మ పాపాయిమీద పాపిష్టి కళ్ళు, కోపిష్టి కళ్ళు
పాపిష్టి కళ్ళల్లో పచ్చాకామెర్లు, కోపిష్టి కళ్ళలో
కొరివిమంటల్లు
॥గోరింట॥

## 54

ఎలా ఎలా దాచావో అలవికాని అనురాగం ఇన్నాళ్ళూ ఇన్నేళ్ళూ
ఎలా ఎలా దాచావో అలవికాని అనురాగం ఇన్నాళ్ళూ ఇన్నేళ్ళూ
పిలచి పిలచినా పలుకరించినా పులకించదు కదా నీ ఎద
వుసురోసురనినా గుసగుసమనినా ఊగదే మది నీ మది
నిదురరాని నిశిరాతురులెన్నో నిట్టూరుపులెన్నో
నోరులేని ఆవేదనలెన్నో ఆరాధనలెన్నో ||ఎలా||

తలుపును తెరుచుకొని వాకిటనే నిలబడతారా ఎవరైనా
తెరిచివుందని వాకిట తలుపు చొరబడతారా ఎవరైనా
దొరవో మరి దొంగవో దొరికావు యీనాటికి
దొరనూకాను దొంగనుకాను నంగనాచి నసలేకాను ||ఎలా||

55

# కార్తీక దీపం

ఆరనీకుమా ఈ దీపం కార్తీక దీపం
చేరనీ నీ పాదపీఠం కర్పూరదీపం
ఇదే సుమా నాకుంకుమ తిలకం
ఇదేసుమా నా మంగళసూత్రం ||ఆ||

ఇంటిలోన నా పాపరూపన గోరంతదీపం
కంటి కెదురుగా కనబడువేళల
నామనస్సులో వెలిగే దీపం
నామనుగడ నడిపే దీపం ||ఆ||

ఆకాశాన ఆ మణిదీపాలే ముత్తయిదువు లుంచారో
ఈ కోవెల లోపల ఈ చిరుదివ్వెల చూచి చుక్కలనుకుంటారో
ఏమైనా ఏదైనా కోవెలలో కొలువై యుండె
దేవికి పట్టిన హారతులే
చేరనీ నీ పాద పీఠం
నా ప్రాణ దీపం ||ఆ||

పాడనా తెలుగుపాట–పరవశనై –నే
పరవశనై మీ యెదుట మీ పాట ॥పాడనా॥

కోవెల గంటల గణగణలో–గో–దావరి తరగల గలగలలో
మావుల తోపుల, మూపులపైన–మసలేగాలుల గుసగుసలో
మంచిముత్యాల పేట –మధురామృతాలతేట... ఒకపాట
॥పాడనా॥

త్యాగయ–క్షేత్రయ, రామదాసులు–తనివితీర వినిపించినదీ
నాడు నాడున కదిలించేది–వాడవాడలా కరిగించేదీ
చక్కారమాటల మూట –చిక్కని తేనెల ఊట...ఒకపాట
॥పాడనా॥

ఒళ్ళంత ఒయ్యారికోక–కళ్లకు కాటుకరేఖ
మెళ్ళోతాళి– కాళ్ళకు పారాణి–మెరిసే కుంకుమ బొట్టు
ఘల్లు ఘల్లున కడియాలందెల – అల్లనల్లన నడయాడే
తెలుగుతల్లి పెట్టనికోట–తెనుగునాట ప్రతినోట ఒకపాట
॥పాడనా॥

57

# సీతమాలక్ష్మి

మావి చిగురు తినగానే—కోయిల పలికేనా
కోయిలగొంతు వినగానే మావి చిగురు తొడిగేనా
ఏమో... ఏమగునోగాని ఆమని—ఈమని ॥మావి॥

తెమ్మరతో తారాటలా – తుమ్మెదతో సయ్యాటలా
తారాటలా—సయ్యాటలా, సయ్యాటలా—తారాటలా
వెన్నెలేకాదు —పగలేకాదు—ఎన్ని నేర్చినది మొన్నటి పువ్వు
బింకాలూ—బిడియాలూ—పొంకాలూ—పోడుములూ
ఏమో—ఎవ్వరిదోగాని —ఈవిరి —గడసరి ॥మావి॥

ఒకరి ఒళ్ళు ఉయ్యాలా—వేరొకరి గుండె జంపాలా
ఉయ్యాలా జంపాలా—జంపాలా ఉయ్యాలా
ఒకరి ఒళ్ళు ఉయ్యాలా—వేరొకరి గుండె జంపాలా
ఒకరి పెదవి పగడాలో వేరొకరి కనుల దివిటీలో
పలకరింతలో—పులకరింతలో ఏమో— ఏమగునో గాని
ఈకథ – మనకథ ॥మావి॥

చాలు...చాలు...ఈ విరసాలు
మేలు ...మేలు... నీ సరసాలు
కంటి చూపులా బాకులు — నీకళ్ళు కలువ
రేకులు
చాలు...చాలు.. ఈవిరసాలు
మనసున మసిలే దొకరితో
నువ్వు మాటాడేదింకొకరితో
మేలు..మేలు... నీ సరసాలు
పదుగురితోనే వలపు నేను పంచుకోలేను
వదిలిపెడితే చాలును బతికి పోతాను
కాదు కాదు పొమ్మంటే—
చేదు చేదు — నీవలపంటే
వాదులాడను ఇంక నీదరికే రాను
మేలు మేలు... నీ సరసాలు
చాలు చాలు ... ఈ విరసాలు

## 59 ఇంటింటి కథ

ఎంత వెఱ్ఱి తల్లివో – ఎన్నాళ్ళీ శోధనా

ఎంత వెఱ్ఱి తల్లివో – ఎన్నాళ్ళీ శోధనా
ఏడవ లేవూ బ్రతుకీడవ లేవూ
ఎంత వెఱ్ఱి తల్లివో – ఎన్నాళ్ళీ శోధనా
కన్నకడుపు – చల్లగా – కలకాలం వుండాలని
కనుల నీరు రానీవు – కోపమైన చూపువూ
ఎంత వెఱ్ఱితల్లివో – ఎన్నాళ్ళీ శోధనా
కొన్నాళ్ళు వెన్నెలలు – కొందరికీ
ఎన్నాళ్ళో చీకటులు – ఎందరికో
నీకు మాత్రం – ఎడతెగని నిశిరాతిరీ నిశిరాతిరీ
ఎంత వెఱ్ఱితల్లివో ఎన్నాళ్ళీ శోధనా
అమ్మా! అని ఆ పిలుపు ఇక నీకు రాదు
వెనక వెనక చూడకు వెళ్ళిపో – వెళ్ళిపో
ఎంత వెఱ్ఱి తల్లివో – ఎన్నాళ్ళీ శోధనా

దూరాన దూరాన తారాదీపం
భారమైన గుండెలో ఆరని తాపం
ఆరిపోదు చేరరాదు ఆశాదీపం
ఆ తారాదిపం...ఈ తీరని తాపం
వికసించిన మందారం నీ వయ్యారం
విరియని పసికందు మొగ్గ నీ హృదయం
మనసులోని మధురమైన మకరందం వున్నదని
మరీ మరీ తిరిగేను మతిమాలిన తుమ్మెదను ॥దూ॥

కనుల నిండ నీ రూపే కాపురముంటే
మనసంతా నీ స్మృతులే రగులుతుంటే
ఎన్నాళ్ళి కారుచిచ్చులోన దాచగలను
ఎన్నాళ్ళి ఒంటరి బ్రతుకిలా ఈడ్వగలను ॥దూ॥

ఒక్కగాలి అలనై నీ చెక్కిలి నిమిరి
ఒక్క మబ్బునై నీపై వలపు జల్లు చల్లి
ఒక్కసారి నీ చెవిలో వీడుకోలు పలికి
రెక్కలు తెగి ఎక్కడో రాలేపోతాను
నీ పక్కకైన రాను... ॥దూ॥

## 61 శ్రీ వినాయక విజయం

ఎవరవయా! ఎవరవయా! ఏ దివ్య భూమినుండి దిగి
ఈ అమ్మ ఒడిలోన ఒదిగి – ఎవరవయా! ఎవరవయా!
ఆ కనుల వెలిగేవి ఏ జ్యోతులో గాని
ఆ నవ్వులు పలికేవి ఏ వేద మంత్రాలో
వేల్పులందరిలోనా తొలివేల్పువోయేమో
పూజలలో మొదటి పూజ నీదేనేమో! ॥ఎవరవయా॥

చిట్టిపొట్టి నడకలు– జిలిబిలి పలుకులు
ఇంతలో ఔరౌర–ఎన్నెన్ని విద్యలో –ఎన్నెని వింతలో
ఎన్నెన్ని కోరికలు నిండి–నే కన్న
ఎన్నెన్నో స్వప్నాలు పండి –చిన్నారి ఈ మూర్తివైనావో
ఈరేడు లోకాలు ఏలేవో ॥ఎవరవయా॥

మ్రోగి మ్రోగి మూగవైనవేలా! ఆ గంధర్వ వీణల తీగెలు
ఆగనేలా పరుగు సందడుల గలగలలు
ఆ మంచు మలలందు వాగులు
ఆ వైపు ఆకాశ సౌధాని కెందుకో అడ్డుగ మేఘాల తెరలు
ఆ వెనుసాగునేమో – ఆది దంపతుల
పార్వతీ పరమేశ్వరుల ప్రణయ లీలలు

ఏది చల్లనా
ఏది తియ్యనా
శిరసున ఆ జాబిల్లి మల్లెపువ్వా
అరవిరిసిన ఆ పెదవుల లేతనవ్వా ॥ఏది॥

ఇటుచూడు గిరిరాజ నందినీ
ఈ పూలు పరచిన వేడినీ
ఎవ్వారు పరచారో గాని ఎవరి పవ్వళింపులకో
ఏ సురవల్లీ సుమములో
ఏరిఏరి ఈ మేను నొచ్చునని
ఏ ప్రేయసీ ప్రియుల కోసమో
చేరి చేరి– ఇలా, ఇలా ఒరగవచ్చునని

# 63 శ్రీ రామ పట్టాభిషేకం

రాజౌనట మన రాముడే – రాముడు సీతా రాముడే
ఇక అయోధ్య వైకుంఠపురి – మన సీతారాముడే శ్రీహరి
॥రాజౌ॥

ఏనాడైనా యిచ్చేనా – యిన్నిన్ని పచ్చని ఆకులు; ఈ
మాకులు
ఏనాడైనా యిచ్చేనా – యిన్నిని వెన్నెల పూవులు ఈ తీగలు
నవరత్నాలే రాసులు తెండి – నక్షత్రాలే కోసుకురండి
తోరణాలకు, ముగ్గులకూ – హారాలకూ, పందిళ్ళకూ
॥రాజౌ॥

మేటికొండపై కొలువుండే – మేఘంలా శ్రీరామచంద్రులు
మేఘంలా మిరుమిట్లు – గొలుపు మెరుపల్లే సీతాదేవి
పట్టపుటేనుగు అంబారిలో – పట్టణమున ఊరేగుతుంటే
ముసలి రాజు గరవం చూడాలి – ముగ్గురమ్మల
మురిపెం చూడాలి
గురువుల గొప్పదనం చూడాలి – అందరము ధన్యులము
కావాలి
॥రాజౌ॥

ఈ గంగకెంత దిగులు – ఈ గాలికెంత గుబులు

కదలదయా – రామా – నా – హృదయింలా నావ
వడి దుడుకుల సంసారపు – కడులులకే తారకుడవు
నీకు గుహుడు కావాల – రామా – ఈ కొద్దిపాటి
ఏరుదాటాలా

॥ఈ గంగ

నిదురపోను కనుమూయను – ఎదురు తెన్ను చూస్తూ, పదు
నాలుగేండ్లపైన క్షణం బ్రతకను సుమ్మీ
ధన్యుడవు గదయ్యా, తమ్ముడా, లక్ష్మణా
భద్రమయా శ్రీరామభద్రునకు, సీతమ్మకు
భద్రము సుమ్మా మన వదినెగారికి, అన్నకు.

